కవిరాజ గ్రంథమాల
పొన్నూరు
గుంటూరు జిల్లా

1953

భారతి ప్రెస్, తెనాలి.

# పరిచయము

పొన్నూరు సంస్కృత కళాశాలాంధ్రోపన్యాసకులగు కవిరాజు శ్రీ కొండపేటి వేంకటకవిగారు ప్రచురించిన శ్రీమత్పరవస్తు చిన్నయసూరి విరచితంబగు "శబ్దలక్షణ సంగ్రహము" అను నీ గ్రంథమును సాకల్యముగాఁ బరిశీలించితిని.

ఆంధ్రము వ్యావహారిక భాషామిశ్రితమై యడుగంటు చున్న కాలమున శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు బయలు వెడలి ప్రాచీనాంధ్రమును నెలకొల్పిరి. వారు మొదట సంస్కృత సూత్రమయ సూత్రాంధ్ర వ్యాకరణము నాంధ్ర సూత్రరూప మగు నీ శబ్దలక్షణ సంగ్రహము మొదలగు గ్రంథములను రచించి వానిని సంస్కరించి తుదికి బాలవ్యాకరణమును బ్రచురించిరని తోఁచెడిని.

ఈ శబ్దలక్షణ సంగ్రహము శ్రీ చిన్నయసూరిగారిచే విరచితముకాదని విద్వాన్ బ్రహ్మశ్రీ కత్తి సాంబమూర్తి శాస్త్రిగారు స్వరచితాంధ్ర ధాతుమాలా పీఠికయందు వ్రాసిరి. కాని యా విషయమును స్థిరపఱుచు వారి యుక్తులు వినలేదు.

ఆంధ్ర ధాతుమాల, శబ్దలక్షణ సంగ్రహములే కాక పెక్కు గ్రంథములు శ్రీ చిన్నయసూరిగారు రచించినట్లు వాడుక గలదని యాంధ్ర ధాతుమాలా పీఠికయం దొక పట్టిక గలదు. అందుఁగొన్నిమాత్రమే శ్రీ పరిషత్తువారిచే ముద్రిత ము లయ్యెను. ఈ శబ్దలక్షణ సంగ్రహమును బ్రచురించి వేంకటకవిగా రాంధ్రలోకము కృతజ్ఞతకుఁ బాత్రులగుచున్నారు.

కవిరాజ గ్రంథమాల

పొన్నూరు

గుంటూరు జిల్లా

1958

భారతి ప్రెస్, తెనాలి.

# పరిచయము

పొన్నూరు సంస్కృత కళాశాలాంధ్రోపన్యాసకులగు కవిరాజు శ్రీ కొండపేటి వేంకటకవిగారు ప్రచురించిన శ్రీమత్పరవస్తు చిన్నయసూరి విరచితంబగు "శబ్దలక్షణ సంగ్రహము" అను నీ గ్రంథమును సాకల్యముగాఁ బరిశీలించితిని.

ఆంధ్రము వ్యావహారిక భాషామిశ్రితమై యడుగంటు చున్న కాలమున శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు బయలు దేఱి ప్రాచీనాంధ్రమును నెలకొల్పిరి. వారు మొదట సంస్కృత సూత్రమయ సూత్రాంధ్ర వ్యాకరణము నాంధ్ర సూత్రరూప మగు నీ శబ్దలక్షణ సంగ్రహము మొదలగు గ్రంథములను రచించి వానిని సంస్కరించి తుదికి బాలవ్యాకరణమును బ్రచురించిరని తోఁచెడిని.

ఈ శబ్దలక్షణ సంగ్రహము శ్రీ చిన్నయసూరిగారిచే విరచితముకాదని విద్వాన్ బ్రహ్మశ్రీ కత్తి సాంబమూర్తి శాస్త్రిగారు స్వరచితాంధ్ర ధాతుమాలా పీఠికలో వ్రాసిరి. కాని యా విషయమును స్థిరపఱుచు వారి యుక్తులు వినలేదు.

ఆంధ్ర ధాతుమాల, శబ్దలక్షణ సంగ్రహములే కాక పెక్కు గ్రంథములు శ్రీ చిన్నయసూరిగారు రచించినట్లు వాడుక గలదని యాంధ్ర ధాతుమాలా పీఠికలో నొక పట్టిక గలదు. అందుఁగొన్నిమాత్రమే శ్రీ పరిషత్తువారిచే ముద్రిత ము లయ్యెను. ఈ శబ్దలక్షణ సంగ్రహమును బ్రచురించి వేంకటకవిగా రాంధ్రలోకము కృతజ్ఞతకుఁ బాత్రులగుచున్నారు.

ఇందును సూత్రాంధ్ర వ్యాకరణము నందును బాల వ్యాకరణమున లేని పెక్కు విషయములు గలవు. ఈ శబ్దలక్షణ సంగ్రహమునకు వృత్తి లేకపోవుటచే నిఁదలి కొన్ని సూత్రముల యర్థము సుగ్రహము కాకున్నది. దీనికి వృత్త్యుదాహరణములు పుట్టుట యత్యావశ్యకము. దీనిలోని పెక్కు విషయములుగల బాలవ్యాకరణమునకు వృత్త్యుదాహృతులు శ్రీ చిన్నయసూరిగారిచే రచింపఁబడినను బాలవ్యాకరణమున లేని సూత్రముల వృత్త్యుదాహరణములు వ్రాయఁబడుట యావశ్యకము.

కోడుగంటివారి వీథి,
విజయనగరము
10—4—58

విన్నవించు సుజనవిధేయుఁడు
వఝల చినసీతారామస్వామిశాస్త్రి

# సమీక్ష

పందొమ్మిదవ శతాబ్దమున సుప్రసిద్ధులగు ఆంధ్ర పండితులలోఁ బేరెన్నికగన్నవారు శ్రీమాన్ పరవస్తు చిన్నయ సూరిగారు. ఈయన మద్రాసులోని కళాశాలలయందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయత్వము వహించి యాజీవితాంతమును సారస్వత సేవ చేసిన మేటిపండితుఁడు.

శ్రీ చిన్నయసూరి కేవల ముపాధ్యాయుఁడే కాఁడు. గొప్ప పరిశోధకుఁడును. ఈయన యొకవంక నుపాధ్యాయత్వము నెఱపుచు వేఱొకవంకఁ బ్రాచీనాంధ్ర వాఙ్మయమును బరిశోధించుచుఁ బదసమూహమును బ్రయోగవిశేషములను సంగ్రహించి బాలుర కుపయుక్తమగు పద్ధతిఁగో నొక కోశమును నొక వ్యాకరణమును రచింపఁ బూనుకొనెను. ఆ విధముగా రచింపఁబూనిన వ్యాకరణమునకుఁ బూర్వరూపములలో నేకదేశమే యీ శబ్దలక్షణ సంగ్రహము. ఇంతకంటెను బూర్వరూపములు మనకు లభించినవి మఱికొన్ని గలవు. అవి పద్యాంధ్ర వ్యాకరణము, ఆంధ్ర శబ్దానుశాసనము, సూత్రాంధ్ర వ్యాకరణమును. ఇందు సూత్రాంధ్ర వ్యాకరణము తప్పఁ దక్కినవి తెనుఁగు రచనలు.

సూరిగారు తొలుత పాణిని మహర్షి రచితమగు అష్టాధ్యాయి నాధారముగాఁ గొని ప్రత్యాహారాది పద్ధతులను, అనువృత్త్యాది మార్గములను అవలంబించి యాంధ్రభాషకు సమగ్రమగు నొక వ్యాకరణమును సంస్కృత సూత్రరూపమున

రచింప సంకల్పించి సూత్రాంధ్రవ్యాకరణము నారంభించి కొంత వఱకు సాగించియుండును. ప్రాచీనాంధ్ర వ్యాకరణములు చింతామణి వికృతివివేకములు సంస్కృతములో నుండుటయే యాతని సంస్కృతసూత్రరచనకుఁ బ్రేరకమైయుండనోపును. కాని రచన కొంతదనుక సాగునప్పటికి, తెనుఁగు వ్యాకరణము సంస్కృతములోనుండి పెక్కుమందికి దుర్బోధమగుటకంటె నా సూత్రములు మాతృభాషలోనే విరచితములగుట యుచితమని తోఁచి వానినే యలతి యలతి మార్పులతోఁ దెనుఁగు సూత్రముల రూపమున ననువదింప నారంభించెను. అదియే యాంధ్రశబ్దానుశాసనము. ఇది రచించు సమయమున చూడామణి, సర్వలక్షణ సారసంగ్రహము, కవిసంశయవిచ్ఛేదము మున్నగువానివలెఁ దెనుఁగు లక్షణము ఛందోబద్ధమై పద్యరూపమున నుండుట బాలురకు ధారణయోగ్యముగా నుండునేమోయని యెంచి యాసూత్రములనే పద్యములలో రచింప మొదలిడెను. ఇదియే పద్యాంధ్రవ్యాకరణము. ఈ రచన కొంతవఱకు సాగునప్పటికే నే లక్షణ గ్రంథమైనను అన్యూనానతిప్రసక్తములగు సూత్రముల రూపమున నుండుట యుచితముగాని ఛందోనియమముచే ననివార్యములగు ననావశ్యకపదముల మేళనముతోఁ బద్య రూపమున నుండుట సరికాదని యాతనికిఁ దోఁచియుండును.

అదియుఁగాక యాతనిదృష్టి యింతవఱకు నష్టాధ్యాయీపద్ధతి ననుసరించి యుండుటచే సంస్కృత సూత్రములుగాని తెనుఁగు సూత్రములుగాని పూర్వోత్తర సూత్రానపేక్షముగఁ బరిపూర్ణార్థావబోధకములు గాకుండుట గోచరించి యుండును.

ఆ లోపము తీర్చుటకై బాలవ్యాకరణ సూత్రముల కాసూత్ర మర్థబోధకమగునట్లు రచింప సంకల్పించుకొని ప్రథమప్రయత్న ముగా నీ శబ్దలక్షణ సంగ్రహమును గొంతకుఁగొంత స్పష్టార్థక ములగు తెనుఁగు సూత్రములలోఁ గూర్చియున్నాఁడు.

ఇంతవఱకు నివియన్నియుఁ దాను బ్రకటింపఁదలఁచిన వ్యాకరణస్వరూపము తేలుటకుఁ గావించిన రచనాప్రయత్న ములు మాత్రమే. కావుననే యసమగ్రములుగా నిలిచిపోయి నవి. తన కభీష్టములగు గుణములతో నప్పటికిని వ్యాకరణ స్వరూపము సిద్ధింపనట్లెంచి యీ శబ్దలక్షణ సంగ్రహమును దన ప్రధాన వ్యాకరణరచనముగా భావింపక తుదికిఁ దాను భారతాదులనుండి సేకరించిన ప్రయోగజాలమును దాను గూర్చుకొన్న వివిధమగు లక్షణపరికరమును ముందిడుకొని యొక నూతన ప్రణాళిక నిర్ణయించుకొని తదనుగుణముగా సుబోధములగు సూత్రములు, ఆవశ్యకములగు నర్థవివరణ ములు, అనురూపములగు లక్ష్యములు మున్నగువానితో బాలవ్యాకరణమును సంతరించి తన యభీష్టముల కనురూప మగు నొక వ్యాకృతి యాకృతిఁగాంచెనని సంతృప్తినందెను. నాఁటినుండి నేఁటివఱకు నది యొక్కటియే ప్రమాణమగు నాంధ్రలక్షణగ్రంథముగా దేశమంతట నుపయుక్తమగుచున్నది. ఇది చిన్నయసూరి వ్యాకృతులఁగూర్చి స్థూలముగా నొనర్చిన పర్యవేక్షణము మాత్రమే.

కాఁగా నీ శబ్దలక్షణసంగ్రహము ప్రస్తుతము ప్రచార ములో నున్న బాలవ్యాకరణమునకుఁగల పూర్వరూపములలో

నొకటి యన్నమాట. ఇయ్యది యున్నదున్నట్లుగా విద్యార్థుల కంత యుపయుక్తము గాకున్నను చిన్నయసూరి వ్యాకరణ రచనా పరిశ్రమను గూర్చి పరిశోధన యొనర్చు పండితులకు మాత్ర మెంతయు నుపకరించును. దీనిని 1902 వ సంవత్సరములో ఓ. వై. దొరస్వామయ్యగారు చెన్నపురిలో వే. నా. జూబ్లీ ముద్రాక్షర శాలయందు ముద్రించి ప్రకటించిరి. సుమారేబది సంవత్సరముల యీ నడుమ కాలములోఁ బునర్ముద్రణమే లేక దీని యునికియే చాలమందికిఁ దెలియదయ్యెను.

ఇట్టితఱి నీ గ్రంథము నుద్ధరించి శ్రీ కొండవీటి వేంకటకవి పునర్ముద్రణ మొనరించుట తప్పక పరిశోధకుల మెప్పు నందఁగలదు. ఈతని లక్షణాసక్తిని మనసార నభినందించుచుఁ బండితమిత్రులు దీనికిఁదగిన ప్రచారము గలిగింప నభిలషింతును.

వాల్తేరు
30—3—58

దువ్వూరి వేంకటరమణశాస్త్రి
ఆంధ్ర విశ్వకళా పరిషత్పండితుఁడు

# మనసూరి

కార్యాకార్య విచారశీలుఁడగు వేంకట్రంగరామానుజా
చార్యుం డాదృతి శ్రీనివాసమను యోషారత్నముం బత్నిగా
నార్యుల్మెచ్చఁ బరిగ్రహించె నయవిద్యాశీల వాగ్ధుర్యసౌం
దర్యౌదార్యయటన్న మేలిపలుకంటం దిగ్విదిగ్వ్రాతముల్.

ద్రవిడవేదప్రబంధమ్ము లుద్గీతింప
నధ్యాపకస్థానమందు నిలిచె
మంత్ర మంత్రార్థధర్మములు వెల్లడిచేసి
కావించెఁ బంచ సంస్కారములను
సంస్కృత ప్రాకృతాచ్ఛద్రావిడాంధ్ర భా
షల గురుండయ్యె సంస్తవమునంది
శేముషీఘనుఁడు లక్ష్మీనృసింహులు సెట్టి
తోడుగా నున్నతోద్యోగియయ్యె

సమముగా జాతులెల్ల మోక్షము గమింప
మార్గముంజూపె నపర రామానుజన్మఁ
డితఁడటంచును జనులు సంస్తుతి యొనర్ప
నలరె వేంకటరంగ రామానుజుండు.

తుష్టింబుష్టినిగూర్చు కూఁతును నొకర్తుంగాంచి వైధవ్యమై
నష్టింగాంచిన దాది లోకము మహాంధప్రాయమై తోఁచె నా
శిష్టాచారుల శోకవారిధులు ముంచెన్ బుత్రకామేష్టితో
నిష్టైశ్వర్యములంద దంపతులు లక్ష్మీశాత్త చిత్తాబ్జులై.

కావించి రఖిల యజ్ఞ ద్రవ్యములు దెచ్చి
పూర్ణాహుతుల సామమును బఠించి
సేవించి రబ్జగర్భావాస దేవేశ
ముఖగణమ్ముల కర్ఘ్యములు ఘటించి
భావించి రానుపూర్వ్యముగఁ దదంశాధి
నాయకాగ్రణులకు దోయిలించి
పూజించి రధ్వరమ్మున నిల్చు యాయజూ
కుల కనర్ఘాంబరావళు లొసంగి

నీతిదప్పక పరుల మోఁచేతినీరు
ద్రావక గడించు ధన మర్థితతికి నిడిరి
శక్తిఁ బాలివోని దశరథేశ్వరులటంచుఁ
బ్రజలు జయవెట్ట యజ్ఞనిర్వహణమందు.

నన్నయ తిక్కనాది కవినాథుల మార్గములం గమించి తె
ల్గన్నల పున్నెపుం గనులుగా వచనంబున దిద్ది తీర్చితో
యన్న! మహాంధ్ర కావ్యము లహర్నిశముం గవితా సహాధిలో
బన్నిన భావబంధు రసబంధములా! పరవస్తు చిన్నయా!

అవి యివి యన్ని సాధువగు నన్నపథంబును వీడి శాస్త్ర గౌ
రవమును నిల్పఁ బెద్దలు పరాకున నొక్కటఁ దప్పుదారి వె
న్నదవిలిన వానినన్నిటి ననాదరణీయ మటంచుఁ ద్రోసి నీ
యవికృత సత్వముం దెలియునట్టు లొనర్చితివయ్య! చిన్నయా!

ఇరువదినాల్గు గ్రంథము లహీనతరంబుగ వ్రాసి యాంధ్రసుం
దరికి నమూల్యరత్నమయధామము లూర్జిత శక్తిఁగూర్చు నీ
యొరవడిలో మహాంధ్ర యువయూథము నిల్పితి వీయుపజ్ఞకై
కరములు మోడ్చెరా! తెలుఁగు ఖండ మఖండకవిత్వదీక్షకై.

పాణిని సూత్రపఙ్క్తి కపవాదము గల్గినఁగల్గుఁగాక నీ
పోణిమి యందుఁ దప్పుఁగనఁబోము కుదించి రచించునట్ల గీ
ర్వాణము మేలుఁగూర్చునని వాదమొనర్చెడి వారికింత వి
జ్ఞానముఁగూర్చి తాంధ్రకవిసంఘము మేలని మెచ్చఁజిన్నయా!

గండరగండడుం గవినికాయ సమర్చితుఁ డాంధ్ర వాఙ్మయో
ద్దండుఁడు శాస్త్రవాద పరిధావన శాబ్దికతత్త్వ సార్వభౌ
ముండు కళాప్రపూర్ణుఁడు సముజ్జ్వలభావుఁడు జాతిభేద శూ
న్యుండగు వజ్ఝలాన్వయుఁడహాహా! నిలఁబెట్టె భవద్యశమ్ము; వా
క్శౌండుఁడు పూరుషాకృతిని గన్న సరస్వతి యాంధ్రభారతీ
భాండ విశారదుండు పరవాద భయంకరుఁ డాత్మతత్త్వ వే
ద్యుండు దయార్ద్రచిత్తుఁడు యథోచిత వాక్పరితోషితాచ్ఛభా
వుండు మహేశనామ జపపూత విశుద్ధచరిత్రుఁ డార్య ధ
ర్ముండు నవీనశాబ్దికనభోమణి వాగనుశాసనుండు వాః
కాండ విదారితారిజనకల్పితవాముఁడు మద్గురుండు స
న్మండల మండితుండు గుణమాన్యుఁడు మువ్వారివంశసింధు చం
ద్రుండు ఋతేరితమ్ముల బుద్ధులలూఁపి సెబాసనంగ వా
క్ఛండిమతో నడంచెఁ గవి కలురియల్లరి నంత నాంధ్ర భూ

ఖండము మంచి కప్పురము గైకొని హారతులిచ్చె దుర్విద
గ్ధుండు గులాభిమానియగు దోషికి బుద్ధిచలించె దుర్విలా
పుండగుటంత నోరుపడిపోయెను దుష్కృత మప్పుడప్పుడే
పండెను గర్మబద్ధుఁడయి పాపపరిష్కృత ఘోరపంకము
గ్నుండయి కుందె నీచుఁ డినఁ గోలెముఁకం గొలుకంగ నక్కయా
దండకువచ్చి రోఁతఁగనదా! పరవస్తు కులాబ్ధిచంద్ర! నీ
వుండుదువోయి తెల్గులనొకొండు వసించినదాఁక నుర్వరన్.

అనవద్య శేముషీ ఘనుఁడ వీవనుటకుఁ
కృతకృత్యుఁడౌ హాయగ్రీవశాస్త్రి
సాహిత్య సాహిత్య సరణిలో నెనలేమి
న్యాయాధిపతి రంగనాథశాస్త్రి
వాదోపవాద విద్వద్గోష్ఠి సరిరామి
వీరవేంకటగిరి విభువరుండు
సువిశేష చారిత్ర శోభివీవనుటకు
యాయజూకాన్వవాయజుఁడవగుట

సంస్కృత ప్రాకృతాంధ్రాంగ్ల శబ్దసార్వ
భౌముఁ డన హూణవిభుదత్త భగ్మకంక
ణమ్ములనంగల సూరి పదమ్ము మాకు
సాక్ష్యమగుఁగాదె వీరవైష్ణవ కుమార!

కలరేమో మును పాణినీయ ముఖవర్గమ్మింత నీజోడుగా
కలరేమో మును తిక్కనాదులు సమగ్రమ్మైన యుజ్జీలుగా
కలరేమో కవిరాజులన్యనృప సత్కారమ్ముతో నీడుగా
కలలోవార్త భవత్సదృక్షులకు నీ గారంబ బపారంబురా!

ప్రాతవడ్డ పురాణపథము వీడక మోత
బరువుగా గ్రంథముల్ వ్రాయునాఁడు
అల్లిబిల్లిగఁ గథ లల్లియుం బాడువా
రిని సమర్థించి వర్థిల్లునాఁడు
కులమత భేదవాదులకు దోహదమిచ్చు
మతకావ్యములు మారుమసలునాఁడు
కోర్కితీర్పనిదానిఁగూర్చి యత్నులుసాఁచి
పచ్చిశృంగారంబు పలుకునాఁడు

యతుల దిగనాడి ప్రాసల నతకరించి
వెట్టిమొట్టి కవిత్వమ్ము వెలయునాఁడు
జననమందవు పరమపావనుఁడ వీవు
చిన్నయా! నీ యదృష్టమ్ము చెప్పఁదరమె.

జీవితరేఖకు నూతన
జీవనముంగూర్చి బ్రతుకుఁజెల్లించిన వి
ద్యావేత్తవు చిన్నయ్యా!
రావయ్యా! భక్తితోఁగరమ్ములు మోడ్తున్.

— 'దివ్యస్మృతుల' నుండి

# జోతలు

ఈ శబ్దలక్షణ సంగ్రహమునకుఁ బరిచయ వాక్యముల నొసఁగిన పూజ్యతాతపాదులు, కళాప్రపూర్ణులు, శాబ్దికతత్త్వ పరిశోధ కాగ్రేసరులునగు శ్రీవఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలవారికి వినయపూర్వక నమశ్శతములు.

ఈగ్రంథమునకు వెలుఁగు బాటను జేకూర్చ 'సమీక్ష' నొనర్చిన పుంభావసరస్వతులు, సంస్కృతాంధ్ర వ్యాకరణ శాస్త్రపారంగతులు మద్గురువులు నగు శ్రీదువ్వూరి వేంకట రమణ శాస్త్రిలవారికి భక్తిపూర్వక నమస్కృతులు.

చిరకాలమున ముద్రింపఁబడి నేఁడు లభింపని యీగ్రంథమును గోరినంతనే నా కొసఁగిన నరసరావుపేఁట వాస్తవ్యులు శ్రీ వంకాయలపాటి మల్లయ్యగుప్తగారికిఁ బ్రియపూర్వక నమస్కారములు.

పొన్నూరు
15—4—58

కొండవీటి వేంకటకవి
ఆంధ్రోపన్యాసకులు
సంస్కృతకళాశాల

తెలుఁగు వెలుంగులాఱి పరిదేవన మందెడివేళ సోదరుల్
తలకొక దారి పల్కుల వెలార్చెడి వేళలఁ గన్నబిడ్డలే
తెలుఁగు పడంతి సూత్రములఁ ద్రెంపెడివేళల వాకు బాఁకుగాఁ
బలికిన ధీరు శాస్త్రపదభాసురుఁ జిన్నయసూరిఁ గొల్చెదన్.

— 'వెప్రూవా చరిత్ర' నుండి

శ్రీ

హయగ్రీవాయ నమః

# శబ్దలక్షణ సంగ్రహము

## ప్రథమ పరిచ్ఛేదము

శ్లో॥ కరోదర ధృతోద్భూత
వనజాతౌ సనాతనౌ
శేషాద్రి శేఖరత్వాద
చ్ఛాయా జాయాపతీ స్తుమః

శ్లో॥ పూర్వేషాం లక్ష్య లక్ష్మాణి
వికృతే ర్వీక్ష్య భూరిశః
క్రియతే బాలబోధాయ
శబ్దలక్షణ సంగ్రహః

౧. సిద్ధి లోకంబువలన గ్రాహ్యంబు.

౨. శాసనం బియ్యది దిక్ప్రదర్శనంబు.

౩. సంస్కృత ప్రాకృతంబులు ప్రకృతులు.

౪. ఈ యది వికృతి.

౫. ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది.

౬. ద్వితీయంబునకు నలువది.

౭. ఇందు ముప్పదియాఱు.

౮. అ–ఆ–ఇ–ఈ–ఉ–ఊ–ఎ–ఏ – ఐ – ఒ – ఓ – ఔ – అం – అఁ
కగ చజయుగ టడణ తదన పబమ యరలవ సహ
ళంబు లాయవి.

౯. ఋ గ్విసర్గ వర్గయు ఙఞ శషంబులు సమంబులం బొరసి చొరంబడు.

౧౦. అచ్చులు ప్రాణంబులు.

౧౧. ఎ ఏ ఒ ఓలు వక్రంబులు.

౧౨. ఐ ఔలు వక్రతమంబులు.

౧౩. హల్లులు ప్రాణులు.

౧౪. క చ ట త పలు పరుషంబులు.

౧౫. గ జ డ ద బలు సరళంబులు.

౧౬. లాఁతులు స్థిరంబులు.

౧౭. నకారంబు ద్రుతంబు.

౧౮. చజ లసాంస్కృతికంబులు దంత్యంబులు.

౧౯. ఇ ఈ ఎ ఏలం గూడినవి తాలవ్యంబులు.

౨౦. కొందఱు పదాదిస్వరయోగంబునం దొంటియ ట్లుండు నండ్రు.

౨౧. ఉభయంబులు సవర్ణంబులు.

౨౨. అంతస్థంబులు లఘువు లలఘువులు నా ద్వివిధంబు లగు.

౨3. అన్యంబు లన్యవ్యాకరణ స్పష్టంబులు.

౨౪. ఇంద రేఫంబు.

౨౫. ప్రత్యయంబు వర్ణకంబు.

౨౬. పదంబు ద్రుతాంతంబు ద్రుతప్రకృతికంబు.

౨౭. అన్యంబు కళ.

౨౮. ఖండబిందునకుఁ బూర్ణం బగు.

౨౯. అంతట దీర్ఘంబుమీఁదం బొడమదు.

3౦. స్థిరంబు బిందుపూర్వంబు గాదు.

3౧. జీర్తగు.

3౨. యకారోష్ఠజస్వరకవకారంబులు పదాదిని లేవు.

3 3. అచ్చు మీఁది యచ్చునకు యడాగమం బగు.

3౪. రా ననం బరంబగుచో నని యెఱుఁగునది.

3౫. అవ్యయ సుప్తిఙంతంబు లనుకరణంబుం ద్రిక్కుం బ్రయోగింపఁ జనదు.

3౬. ఈభాష తత్సమంబు తద్భవంబు దేశ్యంబు గ్రామ్యంబు నా నలువిధంబులం బరఁగు.

3౭. ప్రకృతిద్వయతుల్యంబు తత్సమంబు.

౩౮. తజ్జాతంబు తద్భవంబు.

౩౯. ప్రవాహసిద్ధంబు దేశ్యంబు.

౪౦. విరుద్ధంబు గ్రామ్యంబు.

౪౧. కవివ్యవహారసిద్ధంబు గ్రాహ్యంబు.

౪౨. అదోషంబున కప్రయోగదోషంబు లేదని యార్యులు వక్కాణింత్రు.

ఇది పరవస్తు చిన్నయసూరికృతంబగు
శబ్దలక్షణసంగ్రహనామకాంధ్రవ్యాకరణంబునందు
సంజ్ఞా పరిచ్ఛేదము.

# ద్వితీయ పరిచ్ఛేదము

క౦॥ శ్రీచరణసరోరుహాలా
క్షాచారువిశాలవక్ష, సంశ్రితజనర
క్షాచరణదక్ష, దుష్టని
శాచరకులశిక్ష, శేషశైలాధ్యక్షా !

౧. ఉత్తున కచ్చు రా సంధి యగు.

౨. అనాది విభక్తి చు వర్ణకంబులందు బహుళంబు.

౩. అత్తునకు.

౪. కి మాదులం దిత్తునకు.

౫. క్రియాపదంబులందు.

౬. మధ్యమ పురుషంబునందు నిత్యంబు.

౭. అచ్చున కామ్రేడితంబు రాఁ బ్రాయికంబు.

౮. విసర్గంబున కనుకరణంబునందు లోపంబు నిత్యంబు.

౯. హల్లునకు ద్విర్వచనం బగు.

౧౦. అహమాదులకు బహుళంబు.

౧౧. నమస్సు నత్వంబున కోత్వంబగు.

౧౨. ఉదంత నామంబునకు వు గాగమంబు నిత్యంబు.

౧౩. కుఱు, చిఱు, కడు, నడు, నిడుల ఱ డలకు ద్విరుక్త టకారం బగు.

౧౪. ప్రథమ మీఁది పరుషంబులకు గ స డ ద వ లగు.

౧౫. క్రియాపదంబు మీఁదం బ్రాయికంబు.

౧౬. పదంబు మీఁద ద్వంద్వంబునందు నిత్యంబు.

౧౭. వికృతిపదంబుల మీఁది సాంస్కృతికంబులకుఁ గలుగవు.

౧౮. ప్రాసంబుల కెల్లవానికి బహుళంబు.

౧౯. అంతట ద్రుతప్రకృతిమీఁద సరళంబులు నిత్యంబుగ నగు.

౨౦. ఆ ద్రుతంబునకు బిందు వొండె నగు.

౨౧. సంశ్లేషంబు.

౨౨. సరళ స్థిరంబులు రా లోపం బగు.

౨౩. నుడితొలి కుఱుచమీఁద నంతటం గలుగదు.

౨౪. ఇఁకాదులు ద్రిక్క ఖండబిందువు లేదు.

౨౫. నిత్యాన్యాగమనివర్ణకంబు స్వరూపంబుతో నుండు.

౨౬. స్వత్వంబు నుమ్మనకుం గలుగదు.

౨౭. ద్రుతంబున కచ్చు రా లోపంబు లేదు.

౨౮. సమాసంబులం దంతట నగు.

౨౯. తలఁబ్రాలు ప్రభృతులందు లేదు.

౩౦. చేత తోడ వలనల కిత్వం బగు.

౩౧. అంద్వాదుల కలి క్కగు.

౩౨. ఉదంతంబునకు స్త్రీసమంబునకుం బరుష సరళంబులు రా నుమ్మగు.

౩౩. టుగాగమం బచ్చు రా సామానాధికరణ్యంబులం దగు.

౩౪. ఒండెం బేర్వాదులకు.

౩౫. పేదాదుల కాలు రా రుక్కు నిత్యంబుగ నగు.

౩౬. సమంబుల కత్వంబున కుత్వంబు నగు.

౩౭. పుం పులు మువర్ణకంబునకు.

౩౮. షష్ఠీసమాసంబునం దుత్తున కచ్చు రా ను మ్మగు.

౩౯. తద్ధర్మభేదకంబునకు.

౪౦. తనంబు రా స్త్రీసమంబులకుం బుం పులకు నదంతగుణ వాచకంబులకు.

౪౧. సర్వంబునకుం బట్టి విభక్తి రా నగు.

౪౨. వృత్తియం దదియవుల యత్వంబునకు లోపంబొండెనగు.

౪౩. తద్ధర్మభేదకంబు మీఁదం గలుగదు

౪౪. ఇత్తునకుం బయిని నిత్యంబు.

౪౫. పతిక్రియార్థంబులు రా మువర్ణకంబునకు మాఱు నెఱి బిందువును విభాష నగు.

౪౬. వాక్యావసానంబున సంధిలేమిని దోషంబు గాదని యార్యు లంద్రు.

ఇది పరవస్తు చిన్నయసూరికృతంబగు
శబ్దలక్షణసంగ్రహనామకాంధ్రవ్యాకరణంబునందు
సంధిపరిచ్ఛేదము.

# తృతీయ పరిచ్ఛేదము

కం. శ్రీ గృహమేధికి నతనిధి
కాగమవేద్యునకుఁ ద్రిభువనారాధ్యునకున్
భోగాపవర్గదాయికి
నాగాధిపశాయి కంజనాభరపతికిన్.

౧. డు ము వు లు ప్రథమ.

౨. ని ను ల ద్వితీయ.

3. చేత తోడ తృతీయ.

౪. కొఱకు కయి చతుర్థి.

౫. వలన కంటె పట్టి పంచమి.

౬. కి కు యొక్క లోపల షష్ఠి.

౭. అందు న సప్తమి.

౮. ద్వితీయాదులు కయి పట్టి యొక్క వర్జితంబులు ద్రుతంబులు.

౯. డు ము వు ని ను న లేకవచనంబులు.

౧౦. లు లలు బహువచనంబులు.

౧౧. లాఁతు లుభయంబులు.

౧౨. లు లల కగు రు రలు రవర్ణకాఖ్యంబులు.

౧3. చేతఁ దోడ లోపలల త డ పలలు లోపించు.

## తృతీయ పరిచ్ఛేదము

౧౪. స్త్రీ పశు జడ భిన్నంబులు మహత్తులు.

౧౫. వానివిశేషణంబులు.

౧౬. క్లీబలింగకంబులు మిత్రాదులు పుంలింగతుల్యంబు లొండె నగు.

౧౭. కొన్నియెడలం దడఁబాటుం జూపడియెడి.

౧౮. మహత్తునకుం బుంలింగంబునకు డుజ్జగు.

౧౯. ఋత్తున కుత్వంబు న్విభక్తి రా నగు.

౨౦. దీర్ఘపూర్వ లోపధంబునకు ర వర్ణకం బగు.

౨౧. సర్వనామ సగతాదులకు.

౨౨. ఆల్వాదులకు.

౨౩. వృద్ధాదుల డుజ్జునకు లోపం బగునొండె.

౨౪. ఇత్వంబునకు మీఁది యాద్యేకవచనంబునకు నిత్యంబు.

౨౫. ఉత్వంబు బహువచనంబు రా నగు.

౨౬. వికృతి నుపోత్తమంబునకు సహితము.

౨౭. ఆదినదోసిల్యాదులకుం గలుగదు.

౨౮. ఋత్తున కస్త్రీలింగంబునకు మువర్ణకం బగు.

౨౯. అసువిభక్తి రా ముగాగమం బగు.

౩౦. మువర్ణంబు నెఱబొట్టుతోడి బువర్ణంబొండె నగు.

౩౧. ఋ ష్మకారంబునకు ద్విర్వచనం బగు.

౩౨. ఒకానొకచో లు ల నలు రా నయ్యాగమంబునకు ళ్లు క్కగు.

౩౩. ఉత్వంబునకు వు వర్ణకం బగు.

౩౪. గో మన్వాదులకు.

౩౫. మహత్తులకు బహుళంబు.

౩౬. సర్వంబున కసువిభక్తి రా వుగాగమం బగు.

౩౭. కొన్నింటి కదంతంబుల కుత్వమాత్రం బగు.

౩౮. ధర్మాదులకు వు వర్ణంబు నగు.

౩౯. వికృతి నుదంతంబుల కొకానొకచోఁ జూపడియెడి.

౪౦. నాగమాత కద్రువ.

౪౧. ఏయది డుజ్జునకుం బ్రకృతి తన్మాత్రంబు డుమంతంబు.

౪౨. ఇత్వంబునకు ని వర్ణకం బగు.

౪౩. డుమంతంబునకు.

౪౪. టాపు రా నిగాగమం బగు.

౪౫. సమంబునకు విభాష నగు.

౪౬. సర్వంబునకు బహుత్వంబున లాగమంబు నిత్యంబు.

౪౭. తోడ సహార్థంబునం దగు.

౪౮. లాఁతి యర్థంబులందుం జూపడియెడి.

౪౯. కంటె నన్యాది యోగంబునం దగు.

౫౦. పట్టి యని గుణంబు హేతు వగుచో నగు.

## తృతీయ పరిచ్ఛేదము

౫౧. పెఱచోఁ జూపట్టెడు.

౫౨. కి వర్ణకం బిత్వంబునకు.

౫౩. నీ మీ లకుం గాదు.

౫౪. శేషషష్ఠికి యొక్కయు నగు.

౫౫. లోపల నిర్ధారణంబునం దగు.

౫౬. విషయ నిమిత్తాదిజంబైన సప్తమికి నాయ

౫౭. ఉత్తునకు జడంబునకు న వర్ణకం బగు.

౫౮ నగాగమంబు షష్ఠికి సమాసంబునయం దగు.

౫౯. కువర్ణకంబు రా నుత్వంబునకు.

౬౦. ఉండిపదంబు కొండొకచో వలన కనుప్రయుక్తం బగు.

౬౧. ఉండి రా ద్వితీయా సప్తము లగు.

౬౨. సర్వనామ భేద్యంబులలోఁ బూర్వప్రయుక్తంబునకుఁ బ్రథమ బహుళంబుగ నగు.

౬౩. విశేషణంబుల షష్ఠికి.

౬౪. భవత్యర్థవ్యవాయంబున సర్వవిభక్తికి నిత్యంబు.

౬౫. జడంబునకు ద్వితీయ కొండె నగు.

౬౬. అనుదంతంబులకుఁ దృతీయాసప్తమ్యర్థంబుల ద్వితీయ యగు.

౬౭. ఔపవిభక్తికంబుల కత్వం బగు.

౬౮. సర్వవిభక్తి సంస్కృతతుల్యంబు.

౧౯. క్వాచిత్కంబుగ నొక్కని కొక్కం డగు.

౨౦. అత్వ న ఋన్నమ్ము లుత్వమునకుంబోలెను ఋత్వమున కగు.

౨౧. ఐత్వం బిత్వ తుల్యంబు.

౨౨. అభిమంత్రణంబునం దదిత్తులకు దీర్ఘం బౌనని యథర్వణుండు వక్కాణించె.

౨౩. ఉత్వంబున కత్వం బేకార్థంబునం దగు.

౨౪. సంబుద్ధిలోపంబున సాంస్కృతికంబునకుం బ్లుతం బగు.

౨౫. సమంబునకు వు డుజ్లోపంబు విభాష నగు.

౨౬. అంతట బహువచనంబున కారగాగమం బగు.

౨౭. ఒండె మధ్యమపురుష యోగంబునందు.

౨౮. ఓ యని తొలుతం బ్రయోగించునది.

౨౯. ఓయి పురుషునకు.

౩౦. ఓరి నీచ మిత్ర భావంబులందు.

౩౧. ఓసి స్త్రీకి

౩౨. మీఁదట రో కానయు నగు.

౩౩. నామంబులకు హ్రస్వం బగు.

౩౪. సదాద్యేకాక్షర దేశ్యంబులకుఁ గాదు.

౩౫. వృథా పల్లక్యాదుల కొండె.

౩౬. కృతహ్రస్వంబులు హ్రస్వతుల్యంబులు.

౮౭. ఋత్వంబునకు డా ప్వగు.

౮౮. ఒండె విధాత్రాదులకు.

౮౯. కుశాదులకు ము లోపం బగు.

౯౦. చరితాదుల కొండె

౯౧. దూతాదులు స్త్రీతుల్యంబులు.

౯౨. అసురయని యసమాసంబున సురద్విషునకు నిత్యంబుగ నగు.

౯౩. సురలని నిర్జరులకు.

౯౪. సఖుఁడు సఖుము పథము.

౯౫. వక్రతమంబుల కోత్వంబు కొండఱ కిష్టంబు.

౯౬. భూ నౌ శబ్దంబులు భువి నావ లగు.

౯౭. గుణవదాదికం బమంతతుల్యంబు నామం బగు.

౯౮. దాని మకారంబు లోపించు.

౯౯. లాఁతి ప్రథమైకవచనతుల్యంబు.

౧౦౦. ఉగాగమంబు హల్లున కగు.

౧౦౧. ద్విత్వంబు.

౧౦౨. చాఁపుమీఁద బహుళంబు.

౧౦౩. అగుణవదాదికి హలంతంబునకు సు లోపంబు నిత్యంబు.

౧౦౪. లాఁతి కజంతంబునకుం బోలె డుజాదు లగు.

౧౦౫. ఋత్విగాదుల కమంతతుల్యత్వం బొండె నగు.

౧౦౬. భగవదాదులకుం బ్రథమాతుల్యతో్వత్వడుజ్ఞు లగు.

౧౦౭. విశ్వకర్మాదులకు డావు నిత్యంబు.

౧౦౮. ఆత్మేమనంతంబులకు విభాష.

౧౦౯ మనుజ సంజ్ఞకు నాంతంబునకుం గ్వాచిత్కంబు.

౧౧౦. శ్వానము.

౧౧౧. మహదభిధానంబు రాజశబ్దంబు రాజే నాఁబడు.

౧౧౨. జగదాదులకు లోపంబు విభాష నగు.

౧౧౩. అపయః ప్రభృతుల సకారంబునకు.

౧౧౪. ఒకానొక్కటికి ద్విత్వంబునకు.

౧౧౫. ద్యు హృచ్ఛబ్దంబులకు దివి హృది నిచ్చ లగు.

౧౧౬. ద్వ్య ద్యల్పసంఖ్యా శతృ రాంత తదాదుల కిందు
యోగంబు సనదు.

౧౧౭. విశేషణంబులకు వాచ్యవల్లింగంబు దఱుచుగ నగు.

౧౧౮. అమహాతిభేదకంబు క్లీబంబు నగు.

౧౧౯. స్త్రీప్రత్యయంబు స్త్రీలింగంబులకెల్ల నియతంబగు.

౧౨౦. ఆ బేజంతంబులు స్త్రీసమంబులు.

౧౨౧. కంధరాదులు క్లీబసమంబులు నగు.

౧౨౨. వికృతినుడువులెల్ల నిరుదెగ లగు.

౧౨౩. అనుదంత స్త్రీలింగంబునకు సర్వంబునకు స్త్రీసమంబు
నకు సు లోపం బగు.

౧౨౪. తద్భవంబులం బ్రాకృతలక్షణంబు ప్రాయికంబుగ నగు.

౧౨౫. బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.

౧౨౬. కొండొక దేశ్యంబులకు మహాత్తులకు డుజ్జగు.

౧౨౭. కయిరాదులకు.

౧౨౮. గండాదులకుంబయి డుడాగమం బగు.

౧౨౯. అంతట నయ్యది ర వర్ణకంబున కగు.

౧౩౦. అది రా నెఱబిందు వగు.

౧౩౧. కూఁతురు రేఫంబు విభక్తి రా లోపించు.

౧౩౨. చెయువున కలఘురవర్ణకం బొండె నగు.

౧౩౩. కుజ్జు కలన్వాదుల నువర్ణంబున కగు.

౧౩౪. బహువచనంబు రా నిత్యంబు.

౧౩౫. అట్లు రేను గోనులకు గుజ్జగు.

౧౩౬. సమాసంబునయందు.

౧౩౭. వేయి లోనగువాని తుదియక్షరంబునకు లోపం బగు.

౧౩౮. బహువచనంబు రా.

౧౩౯. చేన్వాదులకు.

౧౪౦. బంధు శ్మశ్రు వాచకంబుల మువర్ణంబునకుం గొందఱి మతంబు.

౧౪౧. ఉపవిభక్తి లివర్ణంబునకు ; నెఱసున్నతో డు వర్ణంబు బహుళంబుగ నగు.

౧౪౨. సలలువర్ణంబునకు.

౧౪౩. ఆల్వాదులకు నిత్యంబు.

౧౪౪. టాకు మీఁది యిత్వోత్వంబులకు లు క్కొఁండె నగు.

౧౪౫. డాకుం బయివానికి.

౧౪౬. ప్రాణంబుపయిదాని కలఘులకారం బగు.

౧౪౭. స్వరలోపంబున నిత్యంబు.

౧౪౮. ఉపధకు ముందరి యఱబిందున కంతటం బూర్ణం బగు.

౧౪౯. సంయుక్తంబు నేకలఘుపూర్వంబుం ద్రిక్క లకారంబు డ తుల్యంబు.

౧౫౦. ఇదంతంబుం ద్రిక్క రేఫంబు.

౧౫౧. మూఁడ లోనగు వాని కల్లోపంబుం జూపట్టెడు.

౧౫౨. ఇట నొకానొక్కనికి సంయుక్త సమాస్తంబునకు వెండియు బహువచనం బగు నండ్రు.

౧౫౩. నామంబున కియాంతంబున కెత్వంబు బహుళంబు.

౧౫౪. అన్ని యిన్ని యెన్ని కొన్ని పలు పెక్కు యీ యే నా నీ మన తా సంఖ్యావాచకంబులు సర్వనామంబులు.

౧౫౫. అన్నిలోనగువానికి బహువచన లోపం బగు.

౧౫౬. మహాత్ముల కలఘురవర్ణకంబును నివర్ణంబునకుం దవర్ణంబు నగు.

౧౫౭. అందొఱుం గలదు.

## తృతీయ పరిచ్ఛేదము

౧౫౮. పలునకు వుక్కగు.

౧౫౯. పెక్కున కక్కు డుట్టు రా నగు.

౧౬౦. ఆ యీ యే లకు డుజ్జగు.

౧౬౧. తొలివానికిం బయి డు ట్టొండె నగు.

౧౬౨. లు ల లకు రడాగమంబు నిత్యంబు.

౧౬౩. డు ద్విరహంబున రవర్ణకంబు నత్వం బిత్వం బగు.

౧౬౪. వుడాగమంబు విభక్తి రా నగు.

౧౬౫. అమహత్తుల కి మ్మూఁడింటికి శసాది బహువచనంబు రా నగు.

౧౬౬. నిగాగమంబు తృతీయాది బహువచనంబు రా నగు.

౧౬౭. అమాద్యేకవచనంబు రా దుడాగమం బగు.

౧౬౮. అ మ్మున్నులకు ని వర్ణకం బగు.

౧౬౯. సు జస్సులకు ది వి యగు.

౧౭౦. అవి ఢా హ్రస్వం బగు.

౧౭౧. ఏ కొండె.

౧౭౨. తగాగమంబు రా మూఁడింటికి.

౧౭౩. ది వు లకు జడ్డ లగు.

౧౭౪. తచ్ఛబ్దం బను ప్రయుక్తంబు విభాష నగు.

౧౭౫. వుడాదికంబు తత్సమానాధికరణ సమాసంబులం గలుగదు.

౧౭౬. మీఁద నంబాంతికార్థంబుల యత్వ ద్విత్వంబులు లోపించు నంతిమంబున కెత్వం బగు.

౧౭౭. తగాగమంబు మహత్తులకు నేకవచనంబు రాఁ బూజయం దగు.

౧౭౮. ఏకం బయి సంయుక్త వకారంబు మీఁది దీర్ఘంబు హ్రస్వంబు నగు.

౧౭౯. జడ్డ లోపంబున నిత్యంబు.

౧౮౦. ఎవ్వరితాదులు మహతి కగు నందురు.

౧౮౧. అవ్వత యాయింతి.

౧౮౨. జడాభిధానంబునం దం దిం దెందులు ద్వితీయాదులు రాఁ దదాదుల కగు.

౧౮౩. సప్తమ్యంతంబులకు.

౧౮౪. నిగంతంబుల కేకత్వంబున నుపవిభక్తి క ట్లత్వం బగు.

౧౮౫. స్త్రీవాచి తచ్ఛబ్దంబునకు సంబుద్ధిని దాన యగు.

౧౮౬. యుష్మ దస్మ త్సామానాధికరణ్యంబు నందు.

౧౮౭. నీ నా సు జస్సులకు వు రు లు ను ము లగు.

౧౮౮. అ మ్యస్సులకు న్ను మ్ము లగు.

౧౮౯. బహువచనంబు రా వీని నకారంబు మకారంబగు.

౧౯౦. మువర్ణకంబు రా నొండె.

౧౯౧. అత్వంబున కేత్వంబు ప్రథమ రా నగు.

౧౯౨. ఒండె వీని మ నలు లోపించు.

౧౯౩. మీఁ పయి లు వర్ణకంబు రడాగమంబుతో నగు.

౧౯౪. ద్విరుక్తంబగు హల్లు రా నంతట హ్రస్వంబు నిత్యంబు.

౧౯౫. మన శబ్దం బుభయార్థకంబు.

౧౯౬. దీని జ శ్శస్సులకు ము ల లగు.

౧౯౭. తా శబ్దంబున కస్మచ్ఛబ్దంబున కట్లు సుప్పులగు.

౧౯౮. తనయని టాపు రా నగు.

౧౯౯. తమ యని బహుత్వంబు నందు.

౨౦౦. రు వర్ణకంబు రా విభాష నగు.

౨౦౧. సంఖ్యలకు వికారంబులు పెక్కులు గలవు.

౨౦౨. సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తు నకుం బోలె మహతి కగు.

౨౦౩. లాఁతికంబె మహత్కార్యంబు బలీయంబు.

౨౦౪. టింట్యాదు లాపవిభక్తికంబులు.

౨౦౫. నామంబుల రు ల్వాదులకు విభక్తి సమాసంబుల బహుప్రకారంబులం జూపడియెడి.

౨౦౬. టిం టు లు కిత్తులుం గలవు.

౨౦౭. అజ్ఝు లోనగు వానికి తిగాగమంబు జడ్డ లోపంబుతో నగు.

౨౦౮. మేన్వాదుల కిత్వం బగు.

౨౦౯. టిం టిక్కులు రాఁ బగ ల్వాదులకు.

౨౧౦. తేపు ప్రభృతుల కత్వం బగు.

౨౧౧. సంఖ్యామీఁది టి ంటిక్కుల కిడాగమం బగు.

౨౧౨. చేఁదు తుదివ్రాయి తివర్ణంబగు నంత్రు.

౨౧౩. నేయి ప్రభృతుల బహువచనంబు రా సయితము.

౨౧౪. ఒకానొక్కనికిం బెక్కు లార్యప్రయోగంబుల నెఱుం గునది.

ఇది పరవస్తు చిన్నయసూరి కృతం బగు
శబ్దలక్షణ సంగ్రహనామ కాంధ్రవ్యాకరణంబునందు
శబ్ద పరిచ్ఛేదము.

# చతుర్థ పరిచ్ఛేదము

కం. శ్రీ నయనోత్పల శీతల
భానుఁడు గలుషాంధకారభానుఁడు గరుణా
ధీనుం డాశ్రిత శుభ సం
ధానుం డధ్యుషిత శేషధరసానుఁ డొగిన్.

౧. ధాతువునకు.

౨. తాల్వోష్ఠ మూర్ధజ ప్రాణంబుల కయవ రాదేశంబు లగు.

౩. నిర్జించుట.

౪. లఘూపధంబునకు గుణం బగు.

౫. స్పృశి కొండె.

౬. లిఖ భుజ రుచ సుఖ కృశంబులకు లేదు.

౭. సృజికి నిర్మాణంబు నందు.

౮. సర్వంబున కించుగాగమం బగు.

౯. వెండియు ణ్యర్థంబునందు.

౧౦. వైకృతంబునకు.

౧౧. పుగాది వికారంబులుం గలవు.

౧౨. చుగాగమంబు న ల డ రాంతంబునకు బహుళంబు.

౧౩. రంజాదుల కణ్యర్థంబునం దిల్లు క్కగు.

౧౪. చుక్క రాఁ దుది గాకు లోపం బగు.

౧౫. ఇంచుక్క రా నిల్లుక్కనకు.

౧౬. ఏకలఘు పూర్వంబున కనయంతంబునకు నంతిమంబునకు మీఁదవానికి నిడాగమంబు విభాష నగు.

౧౭. వక్రంబునకు.

౧౮. వర్తమానాతీతాగామి తద్ధర్మ వ్యతిరేకంబులందు విభక్తు లగు.

౧౯. చువర్ణకంబు శత్రర్థంబునం దగు.

౨౦. ఉన్నానుబంధంబు రా.

౨౧. అయ్యాది వర్తమానంబునందు విభక్తి రా నగు.

౨౨. కలానుబంధంబు భావియందు.

౨౩. ఉన్నానుబంధంబునకు దీర్ఘం బగు.

౨౪. ది వి రాఁ గలుగదు.

౨౫. ఇత్వంబు క్త్వార్థంబునం దగు.

౨౬. భూతంబు నందు.

౨౭. ప్రత్యయోత్వంబునకు.

౨౮. ప్రథమైకవచనం బెత్వం బగు.

౨౯. తద్ధర్మంబునందు దువర్ణకంబు రా నగు.

౩౦. డి డులు రా నిత్యంబు.

౩౧. ఎత్వంబు మీఁది దువర్ణంబు దవర్ణం బగు.

౩౨. వులోపంబునం గాదు.

౩౩. ప్రథమైకవచనంబునకు డి డు లోపంబు లగు.

౩౪. లాఁతివచనంబు రా దు వర్ణకం బగు.

౩౫. తి వర్ణకంబు భూతంబునం దనాది విభక్తి రా నగు.

౩౬. ఉత్వంబున కత్వంబు వ్యతిరేకమం దగు.

౩౭. ఆగామి కర్మానుబంధ తుమర్థంబుల ద్రుతంబు నగు.

౩౮. చకారంబునకు వకారం బత్వమధ్యమ ము డుజ్యోగంబు
నం దగు.

౩౯. పకారం బాగమంబునకు.

౪౦. బిందు తద్విషయ ను వర్ణంబుల మీఁద.

౪౧. ఇంచుక్కు రాఁగా సర్వంబునకు.

౪౨. దీనికి దా ది వర్ణకంబు రా నగు.

౪౩. మించులోనగు వానికి వికారంబు లేదు.

౪౪. వ ప వ్యత్యయంబు క్వాచిత్కంబుగం గలదు.

౪౫. మధ్యమైక బహువచనంబులకు వు రు లగు.

౪౬. ను ము లుత్తమంబునకు.

౪౭. డు ఋ లు ప్రథమంబునకు.

౪౮. అమహాదభిధానంబునందు దు వు లగు.

౪౯. ది వి వర్తమానంబునందు.

౫౦. భూతధర్మంబుల బహువచనంబున కేకవచనం బగు.

౫౧. మధ్యమంబునకు వి వు లోపం బొండె నగు.

౫౨. ము డుజ్జులు సదా సంప్రార్థనంబులం దగు.

౫౩. తవర్ణకం బాశీస్సులందు సర్వవచనంబుల కగు.

౫౪. ఎడువర్ణకం బొండె నగు.

౫౫. కాతఁ గావుతఁ గాక తద్ధర్మక్రియాపదంబున కనుప్రయుక్తంబు లగు.

౫౬. మధ్యమ ము డుజ్జులు రా హ్రస్వంబగు.

౫౭. తల్లోపంబునం గలుగదు.

౫౮. ఆ హ్రస్వంబుమీఁది మువర్ణకంబునకు జడ్డ యగు.

౫౯. ధ్రువంబునందు యుష్మదస్మదభిధానంబగు మువర్ణకంబుఁ రా దవర్ణకం బగు.

౬౦. తివర్ణక తకారంబు సున్నమీఁదిది టకారం బగు.

౬౧. నస్థానికంబగు దానిమీఁద దకారంబు విభాషను డకారం బగు.

౬౨ చువర్ణంబునకు దకారంబురా లోపంబు నిత్యంబు.

౬౩. ఆ దకారంబు తకారం బగు.

౬౪. క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు.

౬౫. స్వార్థంబునం గ్వాచిత్కంబు.

౬౬. కొను రా నిత్యంబగు.

౬౭. యాంతంబునకు నిత్యంబు.

౬౮. ఇత్వం బెత్వంబు రా నుపోత్త మోత్వంబున కిత్వం బగు.

౬౯. క్త్వార్థాదులయందు యాకు సకారంబగు.

౭౦. పడుధాతువు కర్మార్థంబునం దను ప్రయుక్తం బగు.

౭౧. వికృతి నొకానొకచో స్వార్థంబునం దట్ల చూపట్టెడు.

౭౨. లాఁతియుఁ గ్వాచిత్కంబుగఁ గలదు.

౭౩. భావలక్షణంబునందుఁ దుమర్థంబున ట యగు.

౭౪. ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు.

౭౫. భూతంబున భేదకం బట్లగు.

౭౬. చేదర్థంబునందు.

౭౭. ఉన్న కల డువర్ణక తల్లోపంబు లయ్యాయి యర్థంబుల భేదకత్వంబునం దగు.

౭౮. నవర్ణకంబు భూతంబునందు.

౭౯. అన్వాదుల కడపాల్లునకు జడ్డయు నత్వంబును విభాష నగు.

౮౦. వ్యతిరేకంబున నివర్ణకంబు నిత్యంబు.

౮౧. కవర్ణకంబు క్త్వార్థంబునందు.

౮౨. కువర్ణకంబు సంప్రార్థనంబులం దగు.

౮౩. అంబాది యోగంబునం గువర్ణంబు మీఁది ము ఘుజ్ఞులకు వు రు లొండె నగు.

౮౪. ఉన్న కలానుబంధంబుల మీఁదం దచ్ఛబ్దం బాఖ్యాతంబు మాఱుంగ నగు నండ్రు.

౮౫. ధాతుజ విశేషణంబుల మీఁద.

౮౬. అత్వంబుమీఁద దాని వకారంబునకు లోపం బగు నండ్రు.

౮౭. అదాదిదీత్తులు మధ్యమముఘుజ్ఞులమీఁద నొండె నగు.

౮౮. వికృతిం బెక్కులు కృద్వర్ణక వికారంబులు గలవు.

౮౯. టవర్ణకంబు భావంబునం దగు.

౯౦. ఇవర్ణకంబు వ్యతిరేకమందు.

౯౧. ఏదాత్వంబులు ప్రశ్నలక్షణంబులు.

౯౨. వ్యతిరేక మధ్యమంబుమీఁద నేదాదులు సంప్రార్థన పరంబు లగు.

౯౩. కర్మానుబంధంబు మీఁదం గర్త్రర్థంబునం బోలె నెల్లవిధు లగు.

౯౪. నామంబునకు ధాతుత్వవివక్షచే నాగమాది కార్యంబు లగు.

౯౫. అడ్డాదుల కించుక్కు రా గుగాగమం బగు.

౯౬. కోపాదులకుం గొంద ఱిచ్ఛయింతురు.

౯౭. కొండొకచో లాఁతి వికారంబుం జూపట్టెడు.

౯౮. తేజః ప్రజ్వాలల కిల్లుక్కు రా రేఫం బగు.

౯౯. భిదాదుల కకర్మకత్వ వివక్షయం దిల్లు క్కగు.

౧౦౦. ణ్యర్థంబు మీఁద ణ్యర్థంబు లేదు.

౧౦౧. అసరూపంబగు.

౧౦౨. పోవుప్రభృతులకు స్వార్థంబునందుం దెంచుధాతు వనుప్రయుక్తం బగు.

౧౦౩. అరుగు ప్రభృతుల కాగమనంబునందు.

౧౦౪. అది రా గువర్ణంబునకు లోపం బొండె నగు.

౧౦౫. చువర్ణంబునకు నిత్యంబు.

౧౦౬. ఉత్తుమీఁద దానికి దకారం బగు.

౧౦౭. పత్వవిషయంబునకు నానయత్యర్థకం బగు.

౧౦౮. ధాతుజ భేదకంబుల కట్టి విభాష ననుప్రయుక్తం బగు.

౧౦౯. వ్యతిరేక క్రియాపదంబు మీఁద భూతంబునందు భవ త్యర్థం బగు.

౧౧౦. కవర్ణకంబు పురార్థయోగంబున క్త్వార్థంబునంబోలె భావంబునం దగు.

౧౧౧. చేదర్థయోగంబున భూతవత్కార్యం బగు.

౧౧౨. జ్ఞాదులకుం బుగాగమంబు పయినణ్యర్థంబునంద యించు క్కగు.

౧౧౩. సర్వంబునకుం గృఞర్థం బొండె ననుప్రయుక్తం బగు.

౧౧౪. తద్యోగంబునం దుపపర్థవత్కార్యంబు నిత్యంబు.

౧౧౫. భ్వాదు లగతికంబు లిందు లేవు.

౧౧౬. ఆత్మార్థాభిధానంబునం దన్యం బసత్తుల్యంబు.

౧౧౭. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయియర్థాం తరాభిధాయకంబు లగు.

౧౧౮. కాదేశాది వికారంబు లగ్వాదులకు నర్థవిశేషంబులం దార్యవ్యవహారంబుల నెఱుంగునది.

ఇది పరవస్తు చిన్నయసూరి కృతంబగు
శబ్దలక్షణ సంగ్రహనామ కాంధ్రవ్యాకరణంబునందుఁ
క్రియా పరిచ్ఛేదము.

# పంచమ పరిచ్ఛేదము

కం. శ్రీలోచనాంజనాంక
శ్రీలలితాధరునిచేతఁ జిరభద్రగుణ
శ్రీలునిచేతన్ దీనకృ
పాలునిచేతన్ వృషాద్రిపాలునిచేతన్.

౧. వికృతిం గ్రియాపదంబులం ద్రిక్కు యాకుం దాలవ్య వక్రంబు లేదు.

౨. ఊయేల వక్రంబున కాత్వం బత్వంబు నగు.

౩. ఉయేల కాత్వం బగు.

౪. తాయెతు పయ్యెద పయ్యద.

౫. అయి యవులు వక్రతమంబులు విభాష నగు.

౬. ఆమ్రేడితంబున కాత్వంబునకు సర్వనామంబునకయియగు.

౭. అనాద్యంబున కసంయుక్తంబునకు గకారంబునకు వకారం బగు.

౮. రు లు డుల యుపోత్తమంబున కేత్వంబునకు హ్రస్వంబగు.

౯. బంగారులోనగు వానియందు.

౧౦. దీర్ఘసమాసంబున నొకానొకచో జీప్పునగు.

౧౧. ఏలాదుల తుదిప్రాణంబునకుం బ్లుతం బగు.

౧౨. పోఁడి ప్రభృతుల డాకు ణకారం బగు.

౧౩. జాది దక్కు లోనగువాని దకారంబులకు జ డ లగు.

౧౪. ఓయనాదుల రెండవహల్లునకు జడ్డ యగు.

౧౫. హల్లునకు లాఁతి హల్లు గాదు.

౧౬. న ల డ రల కగు.

౧౭. తకారంబు సా కగు.

౧౮. టాకు న త లగు.

౧౯. సర్వంబునకుం గ్రార గలదు.

౨౦. పదాదిం దన్మాత్రం బగు.

౨౧. సర్వత్ర చ ణ య అలకు లేదు.

౨౨. హాకు హాల్యోగంబు గలుగదు.

౨౩. ఉగ్మలి ముత్యము జోస్య మ ప్డి ప్డెప్డు కాయ్వు చెయ్వు చెద్ది యొద్దుట చెద్దము.

౨౪. అందు వర్ణకంబు ద్రిక్కం బ్రత్యయాగమంబులు రా సంధి యగు.

౨౫. పొదరిల్లు బొమ్మరిల్లు పాఁపరమ్ము.

౨౬. వర్గయు క్సరళ తుంబులు రా ద్రుతంబునకు నెఱబిందువు క్వాచిత్కంబుగం జూపట్టెడు.

౨౭. విజయంచేయుట పూజ్యాగమనంబు.

౨౮. ము బులతో నన్వార్థకంబు నగు.

౨౯. కొంపోవుట కొనిపోవుట ప్రాపణంబు.

౩౦. హల్మధ్యగంబున కన్యతర సవర్ణంబునకు లు క్కగు.

౩౧. రవర్ణకంబు రా డువర్ణంబు నుత్వంబునకు.

౩౨. కాఁడు డుజ్జున కలఘువు రా నగు.

౩౩. అలఘులకారంబు మీఁది లువర్ణకంబునకు విభాష.

౩౪. నీలుగు లోనగు వాని తొలిహల్లునకు.

౩౫. కడ ను లుల జడ్డ కస్వర సంధి నగు.

౩౬. అక్కటాదులందు.

౩౭. వదత్యర్థ పకారంబునకు మధ్యమ ముడుజ్జులు రా నగు.

౩౮. టవర్ణకంబునకుం గొఱకు కంటె పొంటె రా నగు.

౩౯. అనాది న ల డ రల యుత్వంబునకు.

౪౦. అబ్బురాదులందు.

౪౧. చిదురుపాదుల దకారంబు మీఁది దాని కగు యుక్త పూర్వంబు గురువు గాదు.

౪౨. లాఁతుల సయితము లాఁతికిఁ జూపడియెడు.

౪౩. అంతాదుల కవధివాచి రాఁ దవర్ణంబునకు.

౪౪. ఏని యిత్వంబునకు.

౪౫. మధ్యమపురుషంబు మువర్ణకంబునకు.

౪౬. అచ్చురాఁ గలుగదు.

౪౭. ఆమ్రేడితంబు రా నంతట విభాష నగు.

౪౮. డుజ్జునకు.

౪౯. ఔపవిభక్తికంబుల విభక్తికి.

౫౦. అందదుకు ప్రభృతులు యథోపదేశంబుగ నగు.

౫౧. కడాదులకుం దొలివ్రాలుమీఁది సర్వంబునకు జడ్డతోడి టవర్ణంబు నిత్యంబుగ నగు.

౫౨. రాఁపు లోనగువానికి లోపం బగు.

౫౩. ప్రాఁతాదులకు సమాసంబునందు విభాష నగు.

౫౪. లుప్తశేషంబులకుఁ గొన్నింటికిం బయిహల్లునకు ద్విర్వచనంబు నిత్యంబుగా నగు.

౫౫. క్రొత్తకు.

౫౬. పసిఁడిలోనగునవి రా నుమ్మగు.

౫౭. ఏకాక్షరంబునకుం బరుషంబులు రా నగు.

౫౮. రాఁకొమరాదులం జూపట్టదు.

౫౯. క్రిందునకుం గ్రి యగు.

౬౦. రావిరేక రారేక.

౬౧. బిందువున కచ్చు రా మకారం బగు.

౬౨. ఎడు త వర్ణకంబుల ద్రుతంబునకు.

౬౩. చకారంబునకు హల్లు రాఁ బరసవర్ణం బగు.

౬౪. ద్రుతంబునకు మకారంబు రా విభాష నగు.

౬౫. ఏకలఘుపూర్వ నువర్ణంబు నుత్వంబునకు వర్తమానార్థ చువర్ణంబు రా లోపంబు చనునకుం ద్రిక్క నగు.

౬౬. తన్నువర్ణంబు బిందు వగు.

౬౭. తి దు ట లు రా నగు.

౬౮. ఉండు డువర్ణంబునకు లోపం బగు.

౬౯. ఉన్నానుబంధంబు రా దాని కంతటికి నిత్యంబు.

౭౦. ఉన్నె.

౭౧. ఇత్వం బుత్వంబయ్యేనే నుపధా చ జ లు సర్వత్ర దంత్యంబు లగు.

౭౨. కూరిచి కుఱించి కుఱియించి కర్మప్రవచనీయకంబులు.

౭౩. కుత్సయం దామ్రేడితంబు నాద్యక్షరంబునకు గివర్ణం బగు.

౭౪. దీర్ఘంబునకు దీర్ఘం బగు.

౭౫. ఆ యీ యేలకు సర్వనామంబులకు మీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు విభాష నగు.

౭౬. ఊష్మ రేఫంబులకుం గాదు.

౭౭. ఎఁడు వర్ణకంబు పరిమాణంబునం దగు.

౭౮. అది రా లి లోపం బగు.

౭౯. అరి మతుబర్థంబునం దగు.

౮౦. కడల్వాదుల కిత్వం బగు.

౮౧. వ్యతిరేకమం దీఁడి వెరవు లోనగు వాని కగు.

౮౨. తవర్ణకంబు వర్ణవాచికి స్త్ర్యర్థంబునం దగు.

౮౩. ఖిండాదులకు.

౮౪. తవర్ణకంబు రా నెత్వంబు క్వాచిత్కంబు.

౮౫. కత్తియ వేడుకాదులకు.

౮౬. కాఁడు మహత్వంబునం దగు.

౮౭. తనము భావంబునందు సర్వంబున కగు.

౮౮. పోఁడి ప్రభృతులకు మివర్ణకంబుం బూర్వోత్వంబున కిత్వంబును విభాష నగు.

౮౯. బడియు ప్రభృతుల కడప్రాయికి లోపంబు నగు.

౯౦. పేదాదులకు ఱిక మగు.

౯౧. నవర్ణకం బదంతగుణవాచకంబునకు.

౯౨. భేద్యంబు రా నిగాగమం బగు.

౯౩. ఱికము రా నుత్వంబున కత్వంబు నిత్యంబు.

౯౪. చిఱుతాదులకు స్వార్థికంబు కవర్ణకంబు నదిరా నుత్వంబును విభాష నగు.

౯౫. అరమరాదుల కిత్వంబగు.

౯౬. మతుబర్థాదులందు లాఁతులుం బెక్కులు గలవు.

౯౭. ప్రథమాంతంబున కస్మద్విశేషణంబునకు బహుత్వంబున మువర్ణకం బగు.

౯౮. యుష్మద్విశేషణంబునకు రువర్ణకంబు విభాష నగు.

౯౯. ని వి యిదంతంబుల కేకత్వంబునం దగు.

౧౦౦. ను వు లు లాంతులకు నిత్యంబు.

౧౦౧. ముపర్ణకాదులు రా నుత్వంబున కత్వం బగు.

౧౦౨. అన్య యుష్మ దస్మ త్కార్యంబుల నుత్తరోత్తరంబు బలీయంబు.

౧౦౩. స్త్రీసమంబులగు విశేషణంబుల కేకవచనంబ తఱుచుగ నగు.

౧౦౪. మ్వాంతంబున కొకానొకచోఁ జూపడియెడి.

౧౦౫. మిన్నులోనగు వానికి బహువచనం బగు.

౧౦౬. సస్యవాచికి ధాన్యాభిధానంబునంవ యగు.

౧౦౭. కర్తృకంబోలె సంబంధంబునందు లాంతికిం క్రియ విశేషణం బగు.

౧౦౮. ప్రధానక్రియ నన్యంబుసమాన కర్తృకంబుంబోలె నగు.

౧౦౯. ఇరుచోఁ గర్తృకుం బ్రథమ యగు.

౧౧౦. టవర్ణకాది యోగంబునందు.

౧౧౧. ధాతుజవిశేషణంబులతో సమాసంబున షష్ఠి యగు.

౧౧౨. సమాసంబు కేవలవికృతిపదంబులతోడిది సమాసకంబండ్రు.

౧౧౩. ప్రకృతి వికృతి పదంబులతోడిది మిశ్రసమాసంబు.

౧౧౪. పరిమితం బంధ్రపదంబు సంస్కృత విశేష్యంబుతో సమసించు.

౧౧౫. స్త్రీసమంబు వికృతిపదంబుతో ద్వంద్వం బగు.

౧౧౬. ద్వంద్వంబునందు ఋత్వంబునకు రవర్ణంబు నగు.

౧౧౭. రేవగల్వాదుల కేకవచనం బగు.

౧౧౮. ద్విగువునకుం బ్రాయికంబు.

౧౧౯. మిశ్రంబునకు లేదు.

౧౨౦. యుష్మ దస్మ దాత్మార్థంబులకు సమాసంబునందు దుగాగమంబు విభాష నగు.

౧౨౧. వేము ప్రభృతులతుదియక్షరంబుపజ్జ నిత్యంబుగ నగు.

౧౨౨. పవర్ణం బినుము ప్రభృతుల కగు.

౧౨౩. బహువ్రీహిని స్త్ర్యర్థంబునం దుపమానంబుమీఁద మేనునకు బోఁడి యగు.

౧౨౪. సమాసాంతంబు లౌపవిభక్తిక తుల్యంబులుం గలవు.

౧౨౫. పెక్కులు ప్రకృతి వికృతిపదంబులు స్వస్వవిభక్తి వికారంబులతోడం గూడి విచ్చలవిడి నొండొంటితో సమసించు.

౧౨౬. సర్వంబునకు సంబంధంబునం దచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు.

౧౨౭. పెఱయర్థంబులం గనుపట్టెడు.

౧౨౮. అంతాది సంఖ్యాపరిమాణార్థంబులమీఁద వీప్సయుం దేసి యగు.

౧౨౯. క్రియాదు లిందుఁ బ్రకారార్థంబు లగు.

౧౩౦. ఏవార్థకాదు లవ్యయంబులు.

౧౩౧. గానంబునందు హ్రస్వంబునకు దీర్ఘశ్రుతి యగు.

౧౩౨. ప్రాసపూర్వంబునకుఁ దత్ప్రయోగంబు సనదు.

౧౩౩. దీర్ఘంబునకు హ్రస్వశ్రుతి దోషంబు.

౧౩౪. సంహితాకృత య వలకు లఘుత్వంబగు నండ్రు.

౧౩౫. ఋ ఌ వర్ణంబులు ర ల తుల్యంబులు.

౧౩౬. ప్రాసాదుల బహుళంబు.

౧౩౭. అంతస్థంబులకు లఘ్వలఘువులకు మిత్రభావంబగు.

౧౩౮. రేఫంబులకు లేదు.

౧౩౯. లగ గలంబులు వహంబులు.

౧౪౦. న హలు సూర్యులు.

౧౪౧. నల నగ సల భ ర త లింద్రులు.

౧౪౨. యాదులు ద్వికలాదులమ్యోనేఁ జంద్రులు.

౧౪౩. వాదులును గణంబులు.

౧౪౪. పాదంబునం దాద్యక్షరంబు వళి.

౧౪౫. ఇయ్యదియేని దీనిమిత్రంబేని యతిస్థానంబు మీఁదం బ్రయోజ్యంబు.

౧౮౬. ద్వితీయంబు ప్రాసంబు.

౧౮౭. ఈయది సర్వపాదంబుల నొక్కఁ డగు.

౧౮౮. ఖండపూర్వ తదన్యంబు లొండొంటికిం జెల్లవు.

౧౮౯. ఏకపాదంబునం దగు.

౧౯౦. సరూప విభక్తిక నాయక విశేషణంబులతోడ నాశ్వాసాంతంబునందును మీఁదం దదాదిని విశేష్యాంతంబులతోడను మంగళం బార్యు లభివర్ణింతురు.

ఇది పరవస్తు చిన్నయసూరి కృతంబగు
శబ్దలక్షణ సంగ్రహనామ కాంధ్రవ్యాకరణంబునందుఁ
ప్రకీర్ణ పరిచ్ఛేదము.

సంపూర్ణము.

# కవిరాజ గ్రంథమాల

| | |
|---|---|
| 1. నెహ్రూచరిత్ర | 3-0-0 |
| 2. దివ్యస్మృతులు | 1-8-0 |
| 3. భావలింగశతకము (పరిష్కర్త) | 0-6-0 |
| 4. కర్షకా ! | 0-4-0 |
| 5. రారాజు | 1-0-0 |
| 6. విశ్వశాంతి | 0-4-0 |
| 7. శబ్దలక్షణ సంగ్రహము | 0-8-0 |
| 8. కొండవీటి పంచశతి (అచ్చులో) | |